శ్రీ

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

# గజేంద్రమోక్షము.

౧. క॥ శ్రీమన్నామపయోద।
శ్యామధరాభృల్లలామ జగదభిరామా।
రామాజనకామమహో।
ద్దామగుణస్తోమధామ దశరథరామా.

---

౨. వ॥ మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుండిట్లనియె. అట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని యిట్లనియె.

౩. సీ॥ మానవాధీశ్వర మనువు నాలవవాఁడు తా
మసుండనగ నుత్తముని భ్రాత। పృథివీపతుల కేతు
పృథునరఖ్యాతాదులతని పుత్రులు పదువురధికబ
లులు। సత్యకహరిధీర సంజ్ఞలు వేల్పులు, త్రిశిఖనా

మమువాఁడు దేవవిభుడు। మునులు జ్యోతిర్వ్యో
మముఖ్యులుహరిపుట్టె హరిమేధునకు బ్రీతిహరిణి
యందు।గ్రహనిబద్ధుడైనగజరాజువిడిపించి।ప్రాణ
భయమువలన బాపికాచె।హరిదయాసముద్రుడఖి
లలోకేశ్వరు। డనినశుకునిజూచియనియెవిభుడు.

४. క॥ నీరాటవ నాటులకుం।
బోరాటం బెట్లుగలిగె బురుషోత్తముచే।
నారాట మెట్లుమానెను।
ఘోరాటవిలోని భద్రకుంజర మునకుః.

౫. క॥ మునినాథ యీకథాస్థితి।
వినిపింపుమువినగనాకు వేడుకపుట్టె।
న్విని యెద గర్ణేంద్రి యములు।
బెనుపండువుసేయమనము ప్రీతిం బొందః.

౬. క॥ ఏకథల యందుపుణ్య।
శ్లోకుడు హరిసెప్పబడును సూరిజనముచే।
సాకథలు పుణ్యకథలని।
యాకర్ణింపుదుయూర్ద్వ లతిహర్షమునః.

౭. వ॥ అనియివ్విధంబున బ్రాయోప విష్టుండైన
పరీక్షిన్నరేంద్రుండు బాదరాయణిని నడిగెనని

చెప్పి సభాసదులైన మునుల నవలోకించిసూతుం డు పరమహర్ష సమేతుండై చెప్పెనట్లు శుకుండు రాజున కిట్లనియె.

౭. సీ॥ రాజేంద్ర వినుసుధా రాశిలో నొకపర్వ తముం త్రికూటంబన దనరుచుండు।యోజనాయు తమగు నున్నతత్వంబును నంతియ వెడలుపు నతి శయిల్లు। గాంచ నాయస్సారకలధౌత మయము లై మూడుశృంగంబులు మొనసియుండు।దటశృం గబహురత్న ధాతుచిత్రితములై దిశలుభూ నభ ములుదేజరిల్లు। భూరిభూజలతారు కుంజపుంజము లును। మ్రోసిపఱతెంచుసెలయేటిమొత్తములు ను। మణిగితిరిగెడుదివ్య విమానములును। జరుల గ్రీడించుకిన్నర చయముగలిగి.

౮. వ॥ అనిమఱియును మాతులుం గలవంగలుం గ చూత కేతకీ భల్లాత కామ్రాతక సరళపనస బదరి వకుళ వంజుళ వటకుటజ కుందకురువక కురంటక కోవిదారఖర్జూర నారికేళ సింధువారచందనపిచు మంద మందార జంబూజంబీర మాధవీమధూకతా ల తక్కోల తమాల హింతాల రసాల సాలప్రియా

ఖు బిల్వామలక క్రముక కదంబ కరవీర కదళీ
కపిత్థ కాంచన కందరాళ శిరీష శింశుపా శోక ప
లాశ నాగ పున్నాగ చంపక శతపత్ర మరువక మ
ల్లికామతల్లికా ప్రముఖ నిరంతర వసంత సమయ
సౌభాగ్యసంపదంకురిత పల్లవిత కుసుమిత ఫలిత లలి
త విటప విటపివీరున్నివహాలంకృతంబును మణివా
లుకానేక విమలపులిన తరంగిణీ సంగతవిచిత్రవి
ద్రుమ లతామహాహ్వాన శుక పిక నికర నిశిత స
ముంచిత చంచూపుట నిర్గళిత శాఖిశాఖాంతర పరిప
క్వఫలరంధ్ర ప్రవర్షిత రసప్రవాహ బహుళంబును
గనకమయసలిల కాసార కాంచన కుముద కల్హా
ర కమలపరిమళ మిళితకబళాహార సంతతాంగీకా
ర భారపరిశ్రాంత కాంతాసమాలింగిత కుమార మ
త్తమధుకర విటపసముదయ సమీప సంచారసము
దంచిత శకుంత కలహంస కారండ వజలకుక్కుట
చక్రవాక కలకంఠ బకబలాహక కోయష్టిక ముఖ
ఖరఝిల్లవిహంగ విసరవివిధ కోలాహల బధిరీభూత
భూనభోంతరాళంబును దుహినకర కాంత మరక
తకమలరాగవజ్ర వైడూర్య నీలగోమేధిక పుష్య

రాగ మనోహరకనకకలధౌత మణిమయానేక శిఖరతటదరివిహారమాణ విద్యాధరవిబుధ సిద్ధచారణ గంధర్వ గరుడకిన్నర మిథునసంతత సరస సల్లాప సంగీత ప్రసంగ మంగళాయతనంబును గంధగజగవయ గండ భేరుండ ఖడ్గ కంఠీరవ శరభ శార్దూల చమర శల్యభల్లసారంగ సాలావృకవరాహమహిష మర్కట మహోరగమార్జాలాదినిఖిలమృగనాథసమూహ సమరసన్నాహ సంరంభసంచకిత శరణాగత శమన కింకరంబును నై యొప్పు నప్పర్వతసమీపంబునందు

౧౦. క॥ ఝిల్లీభల్లులు లాయక। భల్లుకఫణి ఖడ్గగవ
యబలిముఖచమరీ। ఝిల్లీహరి శరభకరికిటి।
మల్లాద్భుత కాకఘూక మయమగు నడవిన్.

౧౧. శా॥ అన్యాలోకనభీకరంబులు జితాశానేక
పానేకము। ల్వన్యేభంబులు గొన్ని మత్తతనను
ప్రజ్యావిహారంబుతో। ధన్యాత్వంబున భూరిభూధర
దరీ ద్వారంబులందుండి సా। జన్యక్రీడలనీరుగాలి
వడిగా సాహావగాహార్థమై.

౧౨. గీ॥ అంధకారమెల్ల నద్రిగుహాంతర।

వీథులందుబగలు వెఱచిడాఁగి।
యెదురులేచీ సంధ్యనినుడువృద్ధతలున్న।
వెడలెననగగుహలు వెడలెగరులు.

౧౩. క॥ తలగవు కొండలకైనను।
మలగవుసింగములకైనమార్కొనుకడిమిం।
గలగవు పిడుగులకైనను।
నిలబలసంపన్నవృత్తి నేనుగుగున్నల్.

౧౪. సీ॥ పులులమొత్తంబులు పొదరిండ్లలోదూ
రు ఘోరభల్లూకముల్గుహలుసొచ్చు। భూదారము
లునేల బొరియలలోడాఁగు హరి దంతముల కేగు
హరిణిచయము। మడువులజొరబారుమహిష సం
ఘంబులు గండశైలంబుల గవులు వ్రాకు। వల్మీక
ములుసొచ్చు వనభుజంగంబులునీలకంఠంబులునిం
గికెగయు। వెఱచిచమరీమృగంబులువిసరువాల।
చామరంబుల విహరణశ్రమమువాయ। భయదప
రిహేలవిహరించుభద్రకరుల।గాలివారినమాత్రా
నజాలిబొంది.

౧౫. క॥ మదగజ దానామోదము।
కదలనితమకముల [illegible]దుపులునిండ౯।

బొందలుచుదుమ్మెదకొదమల।
కదుపులు జుంజుమ్మటంచుగానముసేసెన్.

౧౬. క॥ తేటియొకటియొరుప్రియకును।
మాటికిమాటికినినాగమదజలగంధం।
బేటికియనితను బొందెడి।
బోటికినందిచ్చునింపుబోటితనమునన్.

౧౭. క॥ అంగీకృతరంగన్మా।
తంగీమదగంధమగుచు దద్దయువేడ్కన్।
సంగీత విశేషంబుల।
భృంగీగణమొప్పెమ్రాసుపెట్టెడుమాడ్కిన్.

౧౮. క॥ వల్లభులువారు మునుపడ।
వల్లభయని ముసరిజేని వారణదానం।
బెల్లక మధుకర వల్లభు।
లుల్లంబున బొందిరెల్ల యుల్లాసంబుల్.

౧౯. మ॥ కలభంబుల్సెరలాడుబల్వలములాఘ్రాణించిమట్టాడుచున్ఫలభూజంబులురాయుచుంజివురుజొంపంబుల్వడినేయుచుం। బులులంగాచెలుపోతులన్మృగములంబోనీక శిక్షించుచున్గోలకులొత్తికలంచుచున్గిరులపైగొబ్బిళ్ళుగోరాడుచున్॥

౨౦. క॥ తోండంబుల మదజలవృత।
గండంబుల కుంభములను ఘట్టన సేయం।
గొండలుదల క్రిందై పడు।
బెండుపడుందిశలుచూచి బెగడుంజగముల్.

౨౧. క॥ ఎక్కడజూచినలెక్కకు।
నెక్కువయై యడవినడుచు నిభయూథముం
నొక్కకరినాథుడేపతెగి। (లో
చిక్కనొకకరేణుకోటిసేవింపంగ౯.

౨౨. వ॥ఇట్లు వెనుకముందఱనడుమనుభయపా
ర్శ్వంబుల దృష్టార్థితంబులైయరుగు దెంచు నేసుం
గుగములంగూడికొని తెలంగువప్పి తొలంగుపడి
యాశ్వరాయత్తంబునం బిత్తంబునంచిత్తంబుగా.
కుంఘటంజేసి తానునుపకరేణు సముదయంబును
నొక్క తెఱువై పోవుచు.

౨౩. సీ॥పల్వలంబులు లేత పచ్చికమచ్చిక జెలుల
కందిచ్చునచ్చికములేక। నిగురుజొంపముల గ్రొ
వ్వులయుపూగొమ్మల బ్రాణవల్లభలకు బాలుబెట్టు।
ఘనదానశీతల కర్ణతాళంబుల దయితల చెమటా
ర్చుతనువులకసి। మ్మదుభగాఁనువులమెల్లిన గళ

ములు నివురుచు బ్రేమతో నెఱపుగఱపు। పిఱుదుచ
కట్లు డగ్గరి ప్రేమతోడ। డాసిమూర్కొని దివికి
దొండంబుసాపు। వెదవివేకించు గ్రీడించు విశ్ర
మించు। మత్తమాతంగమల్లంబు మహిమతోడ.

౨౪. సీ॥ తనకుంభములపూర్ణతకుడిగ్గియువతు
లకుచములపయ్యెదకొంగులీవ। తనయాన గంభీ
రతకుజాలకబలలయానంబునందెల్లనండగొనగ।
దనకరశ్రీగనితలగిబాలలచిఱుదొడలు మేఖల దీ
ప్తిదోడుబిలువ। దనదంతరుచికోటితరుణులనగవు
లుముఖచంద్రదీప్తులమసుకుదిగువ। దనదులావ
ణ్యరూపంబుదలచిజూడ। నంజనాభ్రముకపిలాది
హరిదిభేంద్ర।దయితలందఱుదనవెంటదగిలినడు
వ। కుంభివిభుడొప్పె నొప్పులకుప్పబోలి.

౨౫. వ॥ మఱియు నానాగహన విహరణమహి
మతో మదగజేంద్రంబు మార్గంబుదప్పిపిపాసాప
రాయత్తచిత్తంబున మత్తకరేణువుల మొత్తంబు
నుందానునుం జనిచని.

౨౬. మ॥ అటగాంచెంగరిణీవిభుండునవఫుల్లాం
భోజకల్హారము। న్నటదిందీవర వారమునమరమీ

నగ్రాహదుర్వారము । న్వటహింతాలరసాలసాల
సుమనోవల్లీకుటీతీరము । న్జటులోద్ధూత మరాళ
చక్రబకసంచారంబుగాసారముఁ.

౨౭. వ ॥ ఇట్లనన్యపురుష సంచారంబును నిష్క-
ళంకంబైన యప్పంకజాకరంబుబొడగని.

౨౮. సీ ॥ తోయజగంధంబుదోగినచల్లని మెల్లని
గాడ్పులమేనులలర । గమలనాళాహార విమలనా
క్కలహంసరవములు సెవులపండువులు సేయ । ఫు
ల్లదిందీవరాంభోరుహామోదంబు ఘ్రాణ రంధ్రం
బులగారవింప । నిర్మలకల్లోలనిర్గతాసారంబు వద
నగహ్వరములవాడుదీర్ప । త్రిజగదభినవ సౌభా
గ్యదీప్తమైన । విభవమీక్షణ ములకును విందు సే
య । నరిగిపంచేంద్రియవ్యవహారములను । మరచి
మత్తేభయూథంబుమడుగుఁజొచ్చెఁ.

౨౯. క ॥ తొండంబుల బూరించుచు ।
గండంబులజల్లుకొనుచు గళగళరవము ।
ల్మెండుకొనవలుదకడుపులు ।
నిండన్వేదండకోటి నీరుఁ ద్రావెఁ. వ॥ అప్పుడు.

౩౦. మ ॥ ఇభలోకేంద్రుడు హస్తరంధ్రముల

నీరెక్కించి పూరించి చం। డభమార్గంబున కెత్తి ని
క్కి వడి నొడ్డాణించి పైఁజిందునా । భభటి న్నీరము
లోన బెల్లగసిన క్రగ్రాహపాఠీనముల్। నభమందా
డెడు మీన కర్కటముల న్బట్టెన్సురల్ మ్రాన్పడన్.

౩౨. వ॥ మఱియు నగ్గజేంద్రంబు నిరర్గళ విహారంబున.

౩౩. సీ॥ కరిణీకరోజ్ఝిత కంకణచ్ఛటదోఁగి సె
లయేటి నీలాద్రి చెలువు దెగడు। హస్తినీహస్త విన్య
స్తపద్మంబుల వేయుగన్నులవాని వెఱవు సూపు। గ
లభీసముత్కీర్ణ కల్హార రజమున గనకాచలేంద్రం
బు ఘనత దాల్చు। గుంజరీ పరచిత కుముద కాండం
బుల ఫణిరాజ మండన ప్రభవహించు। మదకరే
ణులముక్తమౌక్తికశుక్తుల। మెఱుగు మొగులతో
డ మేలమాడు। నెదురులేనిగరిమ నిభరాజమల్లం
బు। వనజగేహకేళి వ్రాలునపుడు.

౩౪. వ॥ మఱియు నాసరోవర లక్ష్మీమద గజేం
ద్రవివిధ విహార వ్యాకులిత నూతన లక్ష్మీవిభవయై
యనంగ విద్యానిరూఢ పల్లవ ప్రబంధపరికంపిత శ
రీరాలంకారయగు కుసుమకోమలియునుంబోలె
వ్యాకీర్ణ చికుర మత్తమధుకర నికరయు విగతరసవ

డన కమలయు నిజస్థాన చలిత కుచ రథాంగ
యుగళయు లంపటిత జఘన పులిన తలయునై
యుండెనంత.

౩౫. సీ॥ భుగభుగాయత భూరి బుద్బుద చ్ఛటల
తోఁగదలుచు దివికి భంగంబు లెగయ। భువనభ
యంకర ఘూత్కారరవమున ఘోరనక్ర గ్రాహ
కోటిబెగడ। వాలవిక్షేపదుర్వారఝంఝానిల వశ
మునఘుమఘుమావర్తముడర।గల్లోలజాలసంఘట్ట
నంబులతటీ తరులు మూలంబులోఁ ధరణిఁగూల। స
రసిలోనుండి పొడగనిసంభ్రమించి। యుదరికు
ప్పించిలఘించిహుంకరించి। బానుగబళించి పట్టు
స్వర్భానుపగిది। నొక్క మకరేంద్రుఁ డిభ రాజు
నొడిసిపట్టె.

౩౬. క॥ వడిదప్పించి కరీంద్రుఁడు।
నిడుదకరంబెత్తివైవ నీరాటంబుఁ।
బెండువడిగినట్లుజలముల।
బడికడువడి బట్టెబూర్వపదయుగళంబుఁ.

౩౭. చ॥ పదములబట్టినందలకు పాటొక యిం
తయులేకశూరత। మదగజ వల్లభుండుధృతి మం

తు డు ద ం త యు గొంతఘట్టనఁ। జెదరగజిమ్మె నమ్మ కరిచిప్పలుపాదులు దప్పనుప్పర । న్వదలిజల గ్రహంబు కరివారముమూలము జీరెగోరులఁ.

౩౭. క॥ కరిదిగుచుమకరిసరసికి ।
గరిదరకిని మకరిదిగుచుగరకరి బెరయఁ ।
కరిమకరి మకరికింగరి ।
భరమున నిట్లుతలకు తలభటులదరిపడఁ.

౩౮. వ॥ ఇట్లు కరిమకరంబులు రెండును నొండొండ సముద్దండతండంబులై తలపడి నిఖిల లోకాలోకనభీకరంబులై యన్యోన్య విజయశ్రీ వశీకరంబులై సంక్షోభిత కమలాకరంబులైహరిహరియునుగిరిగిరియునుంచాకి పిఱుతివియక పెరంగుతెరంగున సీరాటంబైన పోరాటం బెట్టుచు వెలికి లోనికిందిగుచుచుగొలంకుకలంకంబంద గడువడి నిట్టట్టుపడితడబడక బుడబుడాను కారంబులై భుగులు భుగుల్లను చప్పుళ్లతో నురువులు గట్టుచు జలంబులుప్పరంబున కెగయంజప్పరించుచుదప్పక వదన గహ్వారంబుల నప్పళించుచు నిశితనితాంత దురంత దంతకుంతంబుల నింతింతలు దునియలైనప్పళం

బన భుసుక చిప్పలు కుదుళ్లు దప్పి రక్తంబులు గ్ర
మ్ముదేరహుమ్మనియొక్కుమ్మడిం జిమ్ముచు నితరే
తర సమాకర్షణంబులం గదలక పదంబులు మొద
లిపట్టువదలక కుదురైయుండుచు బరిభ్రమణ వే
గంబున జలంబులం దిరుగుచు మకరకమఠకర్క
ట గండక మండూకాది సలిల నిలయంబులు ప్రా
ణంబులు క్షీణంబులుగా నొకటి కొకటిందాకు ర
భసంబున నిక్కలువడ వ్రగ్గంద్రొక్కుచు మెం
డు చెడి బెండుపడి నాచుగుల్ల చిప్ప తండంబుల
బరస్పరతాడనంబులకు సడ్డంబుగా నొడ్డుచు నో
లమాసగొనక గెలుపు తలంపులు బెట్టిదంబులై రె
ట్టింప నహోరాత్రంబులుంబోలె గ్రమక్రమ వి
జృంభమాణంబులై బహుకాల కలహవిహారంబులై
నిర్గతనిద్రాహారంబులై యవక్రపరాక్రమ ఘో
రంబులై పోరుచున్న సమయంబున.

౮౦. క॥ జవమును జలమును బలమును।
వివిధములుగ బోరుకరటి వీరతకు భువిన్।
దివిమకర మీనకర్కట।
నివహములొక్కటనమిత్రనిలయము జెందెన్.

౪౧. శా ॥ ఆటోపంబున జిమ్ము రొమ్ముగలవజ్రా
భీలదంతంబులన్ । దాటించున్నెడజుట్టిపట్టి హరిదో
ర్దండాభశుండాహతి । న్నీటన్మాటికిమాటికిందిగువ
గానీరాటమున్నేటిపో । రాటందోటమిపాటుజూ
పుట కరిణ్యాటంబువాచాటమై.

౪౨. వ॥ అప్పుడు.

౪౩. గీ ॥ మకరితోడబోరు మాతంగవిభునినో ।
క్కరుణిడించిపోవగాళ్లురాక ।
కోరిచూచుచుండె గుంజరీయూథంబు ।
మగలుతగులుగారె మగువలకును.

౪౪. వ॥ అంత.

౪౫. గీ ॥ జీవనంబుతనకు జీవనంబైయుంట ।
నలవుబలమునంతకంత కెక్కె ।
మకర మొప్పెడస్సెమ త్తేభమల్లంబు ।
బహుళపక్షసీతభానుపగిది.

౪౬. మ ॥ ఉరుకుంగుంబ యుగంబుపై హరిక్రి
యన్ । హుమ్మంచుబాదంబులన్ । దిరుగంగంతమ
పెన్నుదన్నునెగయున్ హేలాగతిన్వాలము । న్గరు
చున్నుగ్గుగ దాకుమంచుమసగున్శల్యంబులుం

చింతింతునె। వ్వారిం జీరుదు నెవ్వరడ్డమిక నివ్వారి
ప్రచారోత్తముఁ। వారింపందగువార లెవ్వరఖిల
వ్యాపారపారాయణుల్। లేరే మ్రొక్కెదదిక్కు
మాలిన మొరాలింపం బ్రపుణ్యాత్మకుల్.

౫౭. శా॥ నానానేక పయోధముల్ వనములో
నం బెద్దగాలంబున। న్నానింపందశలక్షకోటికరిణీ
నాథుండనైయుండిమ। ద్దానాంభః పరిపుష్పచంద
నలతాం తచ్ఛాయ లందుండలే। కీనీరాశి కిటేలవ
చ్చితిభయం బెట్లోగదేయీశ్వరా.

౫౮. ఉ॥ ఎవ్వనిచే జనించుజగ మెవ్వని లోపల
నుండులీనమై। ఎవ్వనియందు డిందు పరమేశ్వరు
డెవ్వడుమూలకారణం। బెవ్వడునాదిమధ్యలయు
డెవ్వడుసర్వముదానయైనవా। డెవ్వడు వానినా
త్మభవునీశ్వరు నేశరణంబువేడెదఁ.

౫౯. క॥ ఒకపరిజగములువెలినిడి।
యొకపరిలోపలికిగొనుచునుభయముదానై।
సకలార్థసాక్షియగున।
య్యకలంకునినాత్మమూలు నర్థిదలంతుఁ.

౬౦. క॥ లోకంబులులోకేశులు।

లోకస్థులు తెగినతుదిన లోకంబగువేళ।
జీకటికవ్వల నెవ్వఁడు।
నేకాకృతి వెలుగునతని నే సేవింతున్.

౬౧. క॥ వర్తకునిభంగి పెక్కగు। మూర్తులతో నె
వ్వఁడాడు మునులుం దివిజుల్। కీర్తింప నేర రెవ్వ
ని। వర్తన మెరుఁ గరట్టి వానినుతింతున్.

౬౨. ఆ॥ ముక్తసంగులైన మునులు దిదృక్షులు।
సర్వభూతహితులు సాధుచిత్తు।
లసదృశవ్రతాఢ్యులై కొల్తు రెవ్వని।
దివ్యపదము వాఁడు దిక్కు నాకు.

౬౩. సీ॥ భవముదోషంబు రూపంబు కర్మంబు నా
హ్వాయముఁ గుణము లెవ్వనికి లేక। జగములుగలి
గించు సమయించు కొఱకు నైనిజమాయ నెవ్వఁడన్ని
యును దాల్చు। నా పరేశునకు ననంతశక్తికి బ్రహ్మ
కిద్ధరూపికి రూపహీనునకును। చిత్రచారునకు సా
క్షికి నాత్మరుచికిని పరమాత్మునకు పరబ్రహ్మమున
కు। మాటల నెఱుకల మనముల జేరంగ। గాని శుచి
కి సత్త్వగమ్యుఁడగుచు। నిపుణులైన వాని నిష్కర్మత
కు మెచ్చు। వానికే నొనరు వందనములు.

చువానికినమస్తాంతరాత్ము। డై వెలుంగువానికచ్చి
న్నునకుభగ। వంతునకుదమజనువస్తుదేశ। దార
శక్తులైనవారికందగరాని। వానికాచరింతు వంద
నములు. ౬౮. వ॥ మఱియును.

౬౯. సీ॥ పరధర్మకామార్థ వర్జితకాములైనిబుధు
లెవ్వాని సేవించియిష్ట। గతిబొందుదురుజేరి కాం
క్షించువారికవ్యయదేహమిచ్చు నెవ్వాడు కరుణ।
ముక్తాత్ములెవ్వనిమునుకొనిచింతింతు రానందవా
ర్ధిమగ్నాంతరంగు। లేకాంతులెవ్వనినేమియుగో
రక భద్రచరిత్రంబుబాడుచుందు। రామహేశ
నాద్యునవ్యక్తునధ్యాత్మ।యోగగమ్యుపూర్ణునన
తాత్ము। బ్రహ్మమైనవానిపరునిజితేంద్రియు। నీశ
స్థూలసూక్ష్మునేభజింతు.

౭౦. వ॥ అనిమఱియునిట్లని వితర్కించె.

౭౧. సీ॥ పావకుండర్చుల భానుండుదీప్తుల
బ్భంగినిగుడింతురెట్లడంతు। రాక్రియనాత్మక
వళిచేత బ్రహ్మాదులవేల్పులనఖిలజంతు। గణమ
జగముల ఘననామరూపభేదములతో మెరం
చితగనడంచు। యెవ్వడుమనమ్ములుబుద్ధీంద్రియ

లుతానయైగుణసంప్రవాహంబుబరపు । స్త్రీనపుం
సకపురుషమూర్తియునుగాక । తిర్యగమరనరాది
మూర్తియునుగాక । కర్మగుణభేదసదసత్ప్రకాశి
గాక । వెనుకనన్నియుదానగు విభుదలంతు.

౨౨. క ॥ కలడందురుదీనులయెడ ।
గలడందురు పరమయోగి గణములపాలన్ ।
గలడందు రన్నిదిశలను ।
గలడుగలండనెడువాడు కలడోలేడో.

౨౩. సీ॥ కలుగడేనాపాలి కలిమిసందేహింప।క
లిమిలేములులేకగలుగువాడు । నాకడ్డపడరాడె
నలినసాధువులచేపడినసాధులకడ్డపడెడువాడు।
చూడడేనాపాటు చూపులజూడక చూచువారల
కృపజూచువాడు। లీలతోనామొరాలింపడేమొర
గుల మొరలెఱుంగుచు తన్ను మొరగువాడు । నఖి
లరూపులుదనరూపమైనవాడు । నాది మధ్యాంత
ములులేకనడరువాడు । భక్తజనముల దీనుల పా
లివాడు । వినడెజూడడెతలవడె వేగరాడె.

౨౪. క ॥ విశ్వకరువిశ్వదూరుని ।
విశ్వాత్మకువిశ్వవేద్యువిశ్వునవిశ్వున్ ।

శాశ్వతునజుబ్రహ్మప్రభు।
నీశ్వరునింబరమపురుషునేభజియింతున్.

౭౫. వ॥ అనిపలికితనమనంబుననగ్గజేంద్రుండీ
శ్వరసన్నిధానంబు గల్పించుకొని యిట్లనియె.

౭౬. శా॥ లావొక్కింతయులేదుధైర్యమువిలో
లంబయ్యెబ్రాణంబులున్। ఠావుల్దప్పెనుమూర్ఛ
వచ్చెతనువుండస్సెన్ శ్రమంబయ్యెడిన్। నీవేతప్ప
నితఃపరంబెరుగ మన్నింపందగుందీనునిన్ । రావే
యీశ్వరకావవేవరదసంరక్షించుభద్రాత్మకా.

౭౭. క॥ వినుదటజీవులమాటలు ।
జనుదటచనరానిచోట్ల శరణార్థులకో ।
యనుదట పిలిచినసర్వము ।
గనుదట సందేహమయ్యెకరుణావార్ధీ.

౭౮. మ॥ ఒకమలాక్షయోవరదయో ప్రతిపక్ష
విపక్షదూరకు।య్యోకవియోగివంధ్యనుగుణో త్త
మయోశరణాగతామరా। నోకహయోమునీశ్వ
రమనోహరయోవిమలప్రభావరా। వేకరుణింప
వేతలపవేశరణార్థినినన్నుగావవే.

౭౯. వ॥ అనిపలికినుజీయున రక్షిత రక్షకుండై

లంచిరో ఖిలుల్ వేద ప్రపంచంబులఁ । దనుజానీకము దేవతానగరిపైఁ దండెత్తెనో భక్తులఁ । గనిచక్రాయుధుఁ డేడీ చూపుఁడనిధిక్కారించిరో దుర్జనుల్.

౭౭. వ॥ అనివితర్కింపుచు.

౭౮. శా॥ తాటంకాచలనంబుతో భుజనటద్ధమ్మిల్లబంధంబుతో । శాటీముక్తకుచంబుతో నదృఢచంచత్కాంతితో శీర్ణలా । లాటాలేపముతో మనోహరకరాలగ్నోత్తరీయంబుతో । గోటీందుప్రభతో నురోజభర సంకోచ ద్వలగ్నంబుతోఁ.

౭౯. క॥ అడిగెదననికడువడిజను ।
నడిగినతనుమగుడనుడుగడనినడయుడుగుఁ ।
వెడవెడసిడిముడితడబడ ।
నడుగిడునడుగిడదుజడిమనడుగిడునెడలఁ.

౮౦. సీ॥ నిటలాలకములంటినివ్వరజుంజుమ్మనిముఖసరోజమునిండ ముసరుతేంట్లు । లళులజోపగజీలకాలల్లనల్లన జేరియోష్ఠ బింబద్యుతులొరయనురుకు । శుకములదోలజక్షుర్మీనములకు మందాకినీపాఠీనలోకమెసగు । మీనపక్షుల్కాలుదాటమెయిదీగెతోరాయశంపాలతలుమింటనరణిగట్టు । శంపల

ఱజయింవచక్రవాకంబులు। కుచయుగంబుదాకి
క్రొవ్వుజాఱు । మెఱత మొగులపిఱుది మెఱుగుదీగె
యుబోలె । జలదవర్ణు వెనుక జరుగునపుడు.

౯౧. మ॥ వినువీథిం జనుదేర గాంచి రమరుల్వి
ష్ణుఁసురారాతిజి । వనసంపత్తినిరాకరిష్ణు కరుణా
వర్ధిష్ణుయోగీంద్రహృ । ద్వనవర్తిష్ణుసహిష్ణుభక్తజ
నబృందప్రాభవాలంకరి। ష్ణునవోఢోల్లసదిందిరా
పరిచరిష్ణుం జిష్ణురోచిష్ణునిన్.

౯౨. వ॥ ఇట్లు పొడగని.

౯౩. మ॥ చనుదెంచెన్ ఘనుడల్లవాడెహరిపజ్జం
గంటిరేలక్ష్మిశంఖనినాదంబదెచక్రమల్లదెభుజంగ
ధ్వంసియున్వాడెక్ర।న్నననేతెంచెనటంచువేల్పు
లునమోనారాయణాయేతిని।స్వనులైమ్రొక్కిఱ
రిమింటహస్తిదురవస్థావక్రికింజక్రికిన్.

౯౪. వ॥ అయ్యవసరంబునకుంజరేంద్రపాలనపా
రవశ్యంబున దేవతానమస్కారంబు లంగీకరింపక
మనస్సమానసంచారుండైపోయిపోయి కొంతదూ
రంబునశింశుమార చక్రంబునుంబోలె గురుమక
రకుళీరమీన మిథునంబైకిన్నరేంద్రునిభాండాగా

రంబునుంబోలె స్వచ్ఛవరకచ్ఛపంబై భాగ్యవంతు నిభాగధేయంబునుంబోలె సరాగజీవనంబై వైకుంఠపురంబునుంబోలె శంఖచక్రకమలాలంకృతంబై సంసారచక్రంబునుంబోలె ద్వంద్వసంకులపంకసంకీర్ణంబై యొప్పుచున్న పంకజాకరంబు పొడగని.

౬౫. మ॥ కరుణాసింధుఁడు శౌరి వారిచరముం ఖండింపఁ దాఁ బంపె । సత్త్వరితాకంపితభూరిచక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా। పరిభూతాంబరశుక్రమున్ బహువిధబ్రహ్మాండభాండచ్ఛటాం । తరనిర్వక్రము పాలితాఖిలసుధాంధశ్చక్రమున్ జక్రమున్.

౬౬. వ॥ ఇట్లు పంచిన.

౬౭. శా॥ అంభోజాకరమధ్యనూతననళినాళ్యాలింగనక్రీడనా। రంభుం డైన వెలుంగురేని చెలువారన్ వచ్చి నీటన్ గుభుల్। గుంభద్ధ్వానముతో గొలంకు వికలంకం బొందగా జొచ్చి దు। ష్టాంభోవర్తి వసించు చక్రము టికి డాయంబోయి హృద్వేగమై.

౬౮. శా॥ భీమంబై తల ద్రుంచి ప్రాణములు బాపెం జక్రమాశుక్రియన్ । హేమక్ష్మాధరదేహముం జకితవన్యేభేంద్రసందోహమున్ । గామక్రోధనగేహ

ముఁ గరటిరక్తస్రావగాహంబుని।స్సీమోత్సాహము
వీతదాహముజయశ్రీమోహముఁ గ్రాహముఁ.

౯౯. వ॥ ఇట్లు నిమిష స్పర్శనంబు సుదర్శనంబు
మకరితల ద్రుంచు నవసరంబున.

౧౦౦. క॥ మకర మొకటిరవిఁజొచ్చెను।
మకరముమఱియొకటిధనదుమాటునడాఁగెన్।
మకరాలయమునదిరిగెడు।
మకరంబులుకూర్మరాజు మఱువునకరిగెన్.

౧౦౧. మ॥ తమముం బాసిన రోహిణీ విభుక్రి
యన్ దర్పించి సంసారదుఃఖమువీడ్కొన్న విరక్త
చిత్తునిగతిం గ్రాహంబుఁబట్టూడ్చి పాదము।లల్లార్చి
కరేణుకావిభుఁడు సౌందర్యంబుతోనొప్పెసం। భ్ర
మదా శాకరిణీ కరోజ్ఝిత సుధాంభస్స్నాన వి
శ్రాంతుడై.

౧౦౨. శా॥ పూరించెన్ హరి పాంచ జన్యముకృ
పాంభోరాశిసౌజన్యముఁ। భూరిధ్వానచలాచలీ
కృతమహాభూత ప్రచైతన్యముఁ।సారోదారసిత
ప్రభాచకితపర్జన్యాదిరాజన్యమున్। దూరీభూతవి
పన్నదైన్యమునున్నిర్ధూతద్విషత్సైన్యముఁ.

౧౦౩. మ॥ మొరసెన్నిర్జరదుందుభుల్ జలరుహా
మోదంబులై వాయువుల్ । దిరిగెఁ బుష్పవలవానజ
ల్లుగురిసెఁ దేవాంగనాలాస్యముల్ । పరగెఁ దిక్కు
లయందుజీవజయ శబ్దధ్వానముల్ నిండెసా । గర
ముప్పొంగె తరంగ చుంబితనభోగంగా ముఖాం
భోజమై.

౧౦౪. వ॥ అప్పుడు.

౧౦౫. క ॥ నిడుదయగు కేలగజమును ।
మడువున వెడలంగదిగిచి మదజలరేఖల్ ।
దుడుచుచు మెల్లన పుణుకుచు ।
నుడిపెఁ విష్ణుండుదుఃఖ మూర్వీనాథా.

౧౦౬. క ॥ శ్రీహరిసంస్పర్శనమున ।
దేహముదాహంబుమాని ధృతికరిణీసం ।
దోహమును దాను గజపతి ।
మోహనఘీంకారశబ్దములతో నొప్పెఁ.

౧౦౭. క ॥ కరమున మెల్లన నివురుచు ।
కరమనురాగమున మెరసికలయంబడుచుఁ
కరిహరికతమున బ్రతుకుచు ।
కరపీడనమాచరించెఁ గరిణులమరలఁ.

౧౦౭. సీ॥ జననాథ దేవలశాపవిముక్తుఁడై పటుత
ర గ్రాహరూపంబు మాని। ఘనుఁడు హాహానామ
గంధర్వుఁడప్పుడు తనతొంటి నిర్మల తనువుఁదాల్చి।
హరికి నవ్యయునకు నతిభక్తితో మ్రొక్కి తవిలి గీ
ర్తించి గీతములు పాడి। యా దేవుకృపనొంది యం
దందం దమరియును వినత శిరస్కుఁడై వేడ్కతో
డ। దళితపాపుఁడగుచు తనలోకమున కేగె। నవుడు
శౌరి కేలనంటనడవ। హస్తిలోకనాథుఁ డజ్ఞానరహి
తుఁడై। విష్ణురూపుఁడగుచు వెలుగుచుండె.

౧౦౮. మ॥ అవనీనాథ గజేంద్రుఁడా మకరితో నాలం
బుగావించె ముఁ। ద్రవిళాధీశుఁడతండు పుణ్యాతము
డింద్రద్యుమ్ను నాముండువై। ష్ణవముఖ్యుండు గృహీ
తమౌననియతిఁ సర్వాత్ము నారాయణుఁ। సవిశే
షంబుగఁ బూజచేసెను మహాశైలాగ్రభాగంబునఁ.

౧౧౦. మ॥ ఒకనాఁడా నృపుఁడచ్యుతున్ మనములో
నూహింపుచున్మౌనియై। యకలంకస్థితినున్న చోఁ గల
శజుండచ్చోటికిన్వచ్చి లే। వక పూజింపక యున్న
మౌనిఁగనిన వ్యక్రోధుఁడై మూఢులు। బద్ధకరీంద్రో త్త
మయోని బుట్టుమ్మని శాపంబిచ్చె భూవల్లభా

౧౧౧. క॥ మునిపతి నవమానించిన।
ఘనుడింద్రద్యుమ్నవిభుడు కుంజరయోనిన్।
జననంబందెను విప్రుల।
గనియవమానింపదగదు ఘనపుణ్యులకున్.

౧౧౨. క॥ కరినాథుడయ్యెనాతడు।
కరులైరిభటాదులెల్ల గజమైయుండెన్।
హరిచరణ సేవకతమున।
కరివరునకు నధికముక్తిగలిగెన రేంద్రా.

౧౧౩. ఆ॥ కర్మతంత్రుడగుచు కమలాక్షుగొల్చు
నుభయనియతవృత్తినుండెనేని। (చు।
చెడునుకర్మమెల్ల శిథిలమైమెల్లన।
ప్రబలమగుచువిష్ణుభక్తిచెడదు.

౧౧౪. క॥ చెడుకరులుహారులుధనములు।
చెడుదురునిజసతులు సుతులుచెడుంచెనటుల
జెడకమను నెరసుగుణులకు। (కుం।
జెడనిపదార్థములువిష్ణుసేవానిరతుల్.

౧౧౫. వ॥ అప్పుడుంజగజ్జన కుండగు నప్పరమే
శ్వరుండుందరహసితముఖ కమలయగు నకక్రమల
కిట్లనియె.

౧౧౬. క॥ బాలానావెను వెంటను।
హేలన్వీనువీధినుండి యేతెంచుచునీ।
చేలాంచలంబు బట్టుట।
కాలో నేమంటినిన్ను నంబోజముఖీ.

౧౧౭. క॥ యెరుగుదు తెరవాఇప్పుడు।
మరువను సకలంబునన్ను మరచినయెడలన్।
మరతుననియెఱిగియెఱుగక।
మరువక మొరయిడిరయేనిమరియన్యములన్।

౧౧౮. వ॥ అనిపలికిన యరవిందమందిరయగు
నయ్యిందిరాదేవి మందస్మిత చంద్రికా వదనార
విందయగుచు ముకుందున కిట్లనియె.

౧౧౯. క॥ దేవాదేవరయడుగులు।
భావంబున నిలిపికొలుచు బనిసాపనిగా।
కోవల్లభయేమనియెద।
నీవెంటన్వచ్చుచుంటె నిఖిలాధిపతీ.

౧౨౦. క॥ దీనులకుయ్యాలింపను।
దీనులరక్షింపమేలు దీవెనబొందన్।
దీనావన నీకొప్పును।
దీనపరాధీన దేవ దేవమహేశా.

౧౨౧. అనిమఱియునుసముచిత సంభాషణంబు లనంకింపుచున్న పరమవైష్ణవీ రత్నంబును సాదర సరస సల్లాప మందహాస పూర్వకంబుగా నాలిం గనంబు గావించి సపరి వారుండై గంధర్వ సిద్ధవి బుధగణ జేగీయమానుండై గరుడా రూఢుం డగు చునిజసదనంబునకుం జనియె నని చెప్పి శుకయో గీంద్రుండిట్లనియె.

౧౨౨. సీ॥ నరనాథనీకును నాచేతవివరింప బడి నయీకృష్ణానుబావమైన। గజరాజమోక్షణకథ వినువారికి యశము హెచ్చునుకల్మషాపహంబు।దు స్స్వప్న నాశంబు దుఃఖ సంహారంబు ప్రొద్దున మే లాంచిపూతవృత్తి । నిత్యంబు పఠి యించు నిర్మ లాత్మకులైన విప్రులకును బహువిభవమలరు। సం పదలు గల్గుపీడలు శాంతిబొందు। సుఖముసిద్ధించు వర్ధిల్లు శోభనములు । మోక్ష మఱచేతి దయ్యెం డుముదముచేరు। ననుచు విష్ణుండుప్రీతుడై యా నతిచ్చె.

౧౨౩. వ॥ అనిమఱియు నప్పరమేశ్వరుం డిట్లని యానతిచ్చె నెవ్వరేనియు నపర రాత్రంబున మే

లాఁగించి సమాహిత మనస్కులై శ్వేత ద్వీపంబు
ను నాకుం బ్రియంబైన సుధాసాగరంబును హే
మనగంబునున్నగ్గిరి కందరకానన నంబులను వేత్ర
కీచక వేణులతా గుల్మసుర పాదపంబులను యేను
గును బ్రహ్మయు శూలలోఁచ నుండును నివసించి
యుండు నికొఁండ శిఖరంబులను కౌ వెరాదకీ
కౌస్తుభ సుదర్శన పాంచ జన్యంబులను శ్రీ దేవి
నిశేష గరుడ ప్రహ్లాద నారదాది ఋషులను మ
త్స్య కూర్మ వరాహాద్యవ తారంబులను తదవతా
ర కృత కార్యంబులను సూర్యసోమ పావకులను
ప్రణవంబును ధర్మతప స్సత్యంబులను వేదంబు
లను వేదాంగంబులను శాస్త్రంబులను గో భూసు
ర సాధు పతివ్రతా జనంబులను చంద్రకాశ్యప
జాయా సముదయంబును గౌరీ గంగా సరస్వతీ
కాళిందీ సునందా ప్రముఖ పుణ్యా తరంగిణీ చ
యంబును నమరులను నమర తరువులను నైరావ
తంబును నమృతంబు ధృవుని బ్రహ్మ ఋషినివహం
బులను పుణ్యశ్లోకులైన మానవులను సమాహిత చి
త్తులై తలం... లకు పా. ... సాన కాలంబున

మదీయంబగు విమలగతి నిత్తునని హృషీకేశుండు నిర్దేశించి శంఖంబు పూరించి విహగ పరివృఢ వాహనుండై వేంచేసె విబుధానీకంబును సంతోషించెనని చెప్పి శుకుండు రాజున కిట్లనియె.

౧౨౪. క॥ గజరాజమోక్షణంబును।
నిజముగ పఠియించునట్టి నియతాత్ములకుఁ।
గజరాజ వరదుఁడిచ్చును।
గజతురగ స్యందనములు కైవల్యంబుఁ.

గజేంద్రమోక్షవ
సంపూర్ణము.



